# GANDHEE SATAKAMU

First Edition 3000,
Second Edition 1000.



AUTHOR

VIDWAN BAIREDDY-SUBRAHMANYAM.
TELUGU PANDIT
MUNICIPAL HIGH SCHOOL, TIRUPATI.



 [0-4-0

HCL 11,579

# తొలిమాట.

ఒకానొక దినమున గృహమునం గూర్చొని పుస్తక పఠనముం జేయుచుం టిని. మొగము పైకెత్తంగా నెదుట కుడ్యస్థాపితమగు మహాత్ముని చిత్రముపై దృష్టిపడినది. ఆదివ్య విగ్రహుని నిర్యాణము పునస్స్మరణకు వచ్చినది. చిత్రమున లగ్నమైన దృష్టిని మరల్చుకొనంజాలనైతిని, ఆయన నిర్యాణముం గూర్చి అంత రంగము దురంత పరివేదనా భరితమైనది. అప్పుడే బాపూజీ స్మృత్యర్థమై యేదేని చిన్ని పొత్తము రచింపవలెనను సంకల్పము కలిగినది. ఫలితమీ గాంధీశతకము.

ఇది పూర్తియైన పిదప కీర్తిమంతులును, దేశ సేవకులును గాంధీసిద్ధాంత ప్రియులునగువారికి కృతియిచ్చుట మేలుంగని నాకుం దోంచినది. ఆం. గౌ॥ ఆర్థికశాఖా మంత్రిశేఖరులు శ్రీయుత బెజవాడ గోపాలరెడ్డిగారు అందులకు సర్వ విధములం దగినవారని నిశ్చయించుకొని శతకమును బంపుచు వారిని సందర్శించి నా సంకల్పమును తెలియపఱచితిని. వారంగీకరించిరి. వారికినా మనఃపూర్వక ధన్యవాదములు.

ఈ శతకమున గాంధిజీ మహనీయత, ఆశయములు, దేశసేవాభిరతి, కీర్తి ప్రతిష్ఠలు, జననిర్యాణ స్థలములు కాలములు నిర్యాణఘట్టము జననీ జనకులు మున్నగు నంశములు వర్ణితములు.

ఈ శతకము ముఖ్యముగా భావిభారత సౌధనిర్మాతలగు విద్యార్థుల హృదయములలో ఉన్నతాశయముల రేకెత్తించుటకుం దోడ్పడంగలదని నానమ్మకము.

దీని సరిచూచి సముచితములగు సలహాలొసంగి, తమ అభిప్రాయము వ్రాసి యిచ్చిన మద్గురువరేణ్యులు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి నా హృదయ పూర్వక నమస్కృతములు.

మఱియు శతకముపై తమ అభిప్రాయము లిచ్చిన సహృదయులగు గురు వర్యులకు, నితర పండితులకు నా మనఃపూర్వక నమోవాకములు.

ఇట్లు.
విద్వజ్జన విధేయుండు
గ్రంథకర్త.

# మలిమాట.

తొలుత ముద్రింపించిన 3000 ప్రతులు గాంధీ శతకములు ఖర్చయి పోయినవి. ఆంధ్రదేశము సర్వము చెల్లాచెదఱుగా శతకముల నాదరించినది. అందులకు నేనెంతయు కృతజ్ఞుఁడ.

పెక్కు వార్తాపత్రికలు శతకముపై సహృదయ సమీక్ష లొసఁగినవి. వానికిని, శతకమును జదివి తమ సంతసమును గద్య పద్యములలో వెలిబుచ్చుచు లేఖలు వ్రాసినపెక్కురు సహృదయ మిత్రులకును, విద్వాంసులకును నా వందనములు.

ప్రతులు ఖర్చయిపోయి చాలకాలమైనది. తెలుఁగు సీమ నుండి యిట్టి ప్రోత్సాహము నాకు లభ్యమగుటచేత, నాచెంత మొదటి ముద్రణము ప్రతులు పిడికెఁడైనను లేక పోవుటచేత ద్వితీయ ముద్రణా ప్రోత్సాహము నన్నినుమడింపఁ జేసినది. ఈ కార్యము సంవత్సరమునకు మునుపెన్నఁడో జరిగియుండవలసినది. కాని సమయ భంగదోషముచే అర్జునుఁడు తీర్థయాత్రకు వెళ్ళినట్లు ప్రైనింగు రహిత దోషముచే నేను పవిత్ర గోదావరీతీరస్థ మగు రాజమహేంద్రవరమునకు యాత్రపోవలసి వచ్చెను. తత్కారణమున ద్వితీయ ముద్రణాకార్యము వెనుఁక బడినది. ఆలస్యముగానైన సహృదయ లోకాదరణముగా మలి ముద్రణ మగుచున్నది.

రెండవముద్రణములో గొన్ని పత్రికాభిప్రాయములుమాత్రము సంగ్రహముగాఁ జేర్చితి. తత్కారణమున పండితాభిప్రాయములుగూడ సంగ్రహించు కొనవలసి వచ్చినది. ఆయా పండితులు, అన్యథా భావింపరాదని వినతి.

ఈ సందర్భమున నేనొక ముఖ్య విషయము వెల్లడించు కొనవలసి యున్నది. అది నా ప్రధాన ధర్మము. ఈ ముద్ర ణాకార్యమునకుధన సహాయమిచ్చినవారు పుస్తకములో వారిపేరు గాని, ప్రస్తావనగాని యుండగూడదని నన్ను హెచ్చరించిరి. కేవ లము నాకృతజ్ఞతా ధర్మమునకై వారిపలుకుల జవదాటి వారి పేర్లను బయలు పఱచుచున్నాను. గుప్తదాతలు, ఉదార గుణులు, సత్కార్య సహాయ సహజ స్వభావులగువారు ముందుపుటలోమీకు "పోషకులు"గాఁ గన్పించువారే. వారికి నాహృదయ పూర్వక ధన్యవాదము లర్పించుకొనుచున్నాను.

శ్రీ P. పంపాపతిరావుగారు (ఇన్వెంటరీ ఆఫీసర్, తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి) శ్రీ P. సుందరంగారు (వ్యాయామవిద్యా బోధకుఁడు, పురపాలకోన్నత పాఠశాల, తిరుపతి) ఇతర మిత్రులుకొందఱును నాకుస్మరణీయులు. పొత్తము రూపొందుటలో:వారి సాహచర్యము నా కుపకరించినది. వారికిఁగూడ నా ప్రణామములు

ఈ మలి ముద్రణములో నాదేశరూపమున నాల్గుపద్యములు జేర్చితి. కొన్ని పద్యములలో నొండు రెండు పదములు మార్చితి, గ్రహింపఁ గోరుదు.

శతకము సుందరముగా శుభ్రముగా ముద్రించి యిచ్చిన రత్నాప్రెస్సువారికి నా కృతజ్ఞతలు.

తిరుపతి,
1—3—54.

ఇట్లు:
కర్త.

# పండితాభిప్రాయాలు

## శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు.

"గాంధి శతకము"ను రచయిత వినిపింపఁగా నా మూలాగ్రము హాయిగా వింటిని. "రాఘవేశ్వరు చారిత్రము నెంద ఱెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే?" అన్నట్టు గాంధిదేవ చరిత్రంబును నెంద ఱెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే! ఈ శతకము పద్యములు ధారాళముగా నిర్దుష్టముగా నున్నవి.

గాంధిగారి "ధారాళమయిన నీతులు' కొన్నియును, చరిత్రాంశములు కొన్నియును, నిందు సంధానితములైనవి. విద్యార్థుల కీ శతకమును సుమతి నీత్యాదుల వలె నేర్పవచ్చును.

16—6—48 వే. ప్రభాకరశాస్త్రి,

విద్వాన్, విశారద.

## శ్రీ జె. చెన్నారెడ్డిగారు, M.A., B.O.L., B.Ed.,

శ్రీ వేంకటేశ్వర కళాశాలా ప్రధానాంధ్రోపన్యాసకులు.

శ్రీ బయిరెడ్డి సుబ్రహ్మణ్యముగారిచే రచింపఁబడిన "గాంధిశతకము" నా మూలాగ్రముగఁ జూచితి. శైలి కడు సులభమై పండిత పామర రంజకమై యలరారుచున్నది, మంచి నుడికారములతోఁ గూడిన జానుందెనుఁగు మిక్కిలి లలితముగ నొప్పియున్నది. ఇతి వృత్తము లోకోత్తర పురుషుని దివ్య జీవితగాథ, ఈశతకము పాఠకుల హృదయములలో "మానవసేవ, త్యాగము"నను మహోదార గుణద్వయమునకు బీజావాపము సేయుననుట కెంతయు సందియము లేదు.

తిరుపతి,
18—6—48

ఇట్లు సుధీవిధేయ,
జె. చెన్నారెడ్డి.

ఉభయ భాషా ప్రవీణ,

## శ్రీ కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీ వేంకటేశ్వర కళాశాలాంధ్రోపన్యాసకులు.

"కందము చెప్పినవాడే కవి"అన్నారు పెద్దలు. కందమూల ఫలాదులతో

కాలము గడిపిన గాంధి మహాత్ముని జీవితము కందమాలికలతోఁ గూర్చుట కడు హృద్యము. ఇందలి కవిత మృదుమధురమై జానుతెనుగు నుడికారములతో జాలువారుచున్నది.

అహింసాది తత్త్వములం దెలుపు నీ చరిత్ర మతి పవిత్రము. ఈ గాంధీశతకము ఆబాల గోపాలమునకు పఠనీయమే.

తిరుపతి,
18—6—48.

ఇట్లు,
కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి

ఉభయ భాషాప్రవీణ-ఆంధ్రవైయాకరణ కేసరి,

## శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మగారు,

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలాంధ్రాధ్యాపకులు.

చిరంజీవి బి. సుబ్రహ్మణ్యనాయుడుగారు రచించిన "గాంధీశతకము" చదివితిని. ఇందలి శైలి, పదముల పొందిక, వస్తు సంపద సహజ సౌందర్య విలాసములు. ఆర్ద్రమనస్సులకు ఆచంద్రార్కము అరచేతి యరటిపండుగా నీ కృతి రచించు భాగ్యము ఈ కవికి అబ్బుట పూర్వజన్మ పుణ్య విశేషము. ఈ శతకము "గాంధీ జాతక సంగ్రహము, భావి భారత భాగ్యోదయ తారకము" అని చెప్పందగును.

పెద్దలందఱు తమ తమ బాలురకు వీరగాధలతో, తత్తచ్చరిత్రలతో, వివరణపురస్సరముగ బోధించుకొను భాగ్యము ఈ శతకమువలనఁ గాంచగలరని దృఢముగా విశ్వసింతును.

తిరుపతి,
28—6—48.

ఇట్లు,
చే. సుశర్మ.

## శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారు, M.A., B.Ed.,

V. R. కళాశాలాంధ్రోపన్యాసకులు.

బయిరెడ్డి సుబ్రహ్మణ్యముగారిచే రచింపఁబడిన గాంధీశతకము చదివితిని అమృతకందములైన కందములలో రచియింపఁబడిన ఈశతకము సుగమశైలితోడ సహృదయహృదయంగమముగనున్నది. కృతికర్త సహృదయ ప్రస్తుతినందుగాక.

నెల్లూరు,
25—6—48.

ఇట్లు,
ధరణికోట వేంకటసుబ్బయ్య.

విద్వత్కవికుల తిలక,

శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు,

చిత్తూరు మండల పండిత మహాసభాధ్యక్షులు.

ఆర్యా! మీరంపిన "గాంధిశతకము" ఆద్యంతము పఠించితి; సంతసించితి. అయ్యది యెల్లరకు సుబోధమైన శైలిలో వ్రాయఁబడినది.

మీరిట్లే మహాత్ముని యుపన్యాస సారాంశములను చిన్నపద్యములలో బాలబాలికలకుఁ బఠనీయముగా వ్రాయుదురుగాక.

చిత్తూరు,
30—6—48,

ఇట్లు,
పూతలపట్టు శ్రీరాములురెడ్డి.

విద్వాన్. ముచ్చేలి సదాశివరెడ్డిగారు,

ప్రధానాంధ్రోపాధ్యాయులు: శ్రీమహంతు హైందవోన్నతపాఠశాల.

సుహృద్వరా!

మ॥ చరితార్థంబగు గాంధిజీ శతకమున్ సంతుష్టిమైఁ జూచితిన్
సరసంబైన కవిత్వమందున జగత్సర్వంబు వంద్యంబుగా
స్మరణార్హంబు మహాత్ముదివ్యకథ; తన్మాహాత్మ్య మెవ్వారి కి
ద్ధరణిన్వేద్యముగాదె? నీ కృతికి నాధన్యోక్తులర్పించెదన్.

వేలూరు,
03—6—48.

ఇట్లు,
ముచ్చేలి సదాశివరెడ్డి.

**J. Ramachandradass,** B.A., B.Ed.

Senior deputy inspector of chools, Chendragiri Range.

Vidwan Sri B. Subrahmanyam is endowed with the gift of writing Sweet Poetry. He is at his best in writing Particularly Kanda Padyas In this booklet of 110 Kanda Padyams on the Father of the Nation, the Poet has brought out all the salient features of Mahatmajee's life and his Message to the world. As other Satakams in Telugu literature, this book will be of great Value to the Pupils in Elementary Schools. I recommend to the teachers in the Elemantry Schools to teach the Stanzas Contained in this book by heart. The Memorisation will have a lasting effect on the futuer citizens of India.

J. Ramachandradass,

CHANDRAGIRI,
1--6--1953.

# పత్రికాభిప్రాయాలు.

## ఆంధ్రప్రభ.

మదరాసు 24—10—1948.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు తిరుపతి మునిసిపల్ హైస్కూలులో తెలుగు పండితులు. 110 ఆనందమైన కందాలలోగాంధీజీ అద్భుతగాథను శతకంగా రచించారు. ఈశతకమును విద్వజ్జనులు విశేషంగా ప్రశంసించారు.

## ఆంధ్రపత్రిక.

మదరాసు 26—12—1948

గాంధీ జీవితచరిత్రను సంగ్రహముగా చిత్రించుచు. ఆయాఘట్టములలో నేర్చుకొనదగు నీతులను, ధర్మములను సులభముగా వ్యక్తీకరించుచు పఠనయోగ్యముగా రచింపబడిన దీశతకము.

## విజయవాణి.

విజయవాడ, 8—12—1948.

కందపద్యాలు కదను తొక్కుతూ నడిచాయి. తీయని కవిత్వం కవితావస్తువులో జీవం ఉంది.

## క్రాంతి.

విజయవాడ, 25—10—1948.

బయిరెడ్డివారు బాలురకు వుపయుక్తంగా కందములతో డెందమున కానందముగా వుండునట్లు కమ్మగా చెప్పారు కవిత. గాంధీజీచరిత్ర నీతులు ఇందులో నిమిడ్చారుఇంపుగా సుబ్రహ్మణ్యంగారు. సుమతీ శతకమువలె పిల్లలకుకంఠస్థం చేయుటకుఇట్టి పుస్తకం పాఠశాలలలో పెట్టుటవసరం.

## జమీన్ రైతు.

నెల్లూరు, 29—10—1954.

కవిగారి శతక రచనమున తన కవితారస వన్నిధిని యొడుదుడుకుల మార్గమున బోనివ్వక సక్రమ మార్గమున జాలు వారించిరె. అలతియలతి సమాసములతో లలిత పద భూయిష్ఠమైన వీరి కవిత మెచ్చుకో దగియున్నది.

## THE HINDU.

Madras, 18—7—1949.

In this small book of hundred and ten verses the author has brought out the salient features of Mahathmajis life and his message Written in simple Kandams they provide interesting for Students.

(N.R.)

# ఈక్రింది నంబర్లుగల పద్య సందర్భములు.

(59) 1947లో కలకత్తాలో హిందూ-మహమ్మదీయ కలహము లుత్పాదిల్లెను. ప్రజలగ్ని ద్రావకముల నైనను ప్రయోగించుకొన జొచ్చిరి. మహాత్ముఁ డచటికి వెళ్ళి శాంతిసందేశ మీయగా కలహాగ్ని చల్లారెను. అంతియేకాదు; హిందూ మహమ్మదీయులు అగ్నిద్రావకములకు బదులు పన్నీరు చల్లుకొన ప్రారంభించిరి. ఈ కారణములచే కలకత్తాబజారులలో నప్పుడు పన్నీరుబుడ్ల కొటకమే యేర్పడెను.

(64) ఒకప్పుడు మహాత్ము నెవరో "మీ యహింసా సిద్ధాంత స్వరూపమెట్టిది"? అని ప్రశ్నింపగా మహాత్ముఁడిట్లు నుడివెను.

"నన్ను జంపుట కొక్కఁడు తుపాకిగుఱిపెట్టు ననుకొనుఁడు. ప్రేల్చబోవు సమయమున నాతనిని సర్పము కఱచెననుకొనుఁడు. అప్పుడు నేనాతని చెంతకేగి, పాము కాటునుండి నా నోటితో విషము పీల్చి వాని దయజూతును. మఱియు పామును హింసింపను."

(73) పెనుగొండ గ్రామము ఆంధ్రభూమియగు పశ్చిమ గోదావరి మండలమున నున్నది. ఆ గ్రామవాసులు గాంధీ పటము నూరేగింపు చేయుచుండఁగా నొక మేక తనంతటతానేవచ్చి ఉత్సవములో పాల్గొని పూర్తియగు వఱకు నూరంతయు తిరిగి కడపట తనదారిం బోయెను.

ఈ యపూర్వ సంఘటన వీక్షించి ప్రజలు మిక్కిలి ఆశ్చర్యము నందిరి.

(101) 1947 చివర నాఫ్రికాలో నొక గొప్ప తోకచుక్క పొడమెను. అది లోకారిష్ట సూచన యని ప్రజలు భీతిల్లిరి. మరల కొంతకాలమునకే గాంధీజీ నిర్యాణమందెను.

# పోషకులు.

శ్రీ R. R. రామనాథరెడ్డిగారు

సహోధ్యాపకులు. పురపాలకోన్నత పాఠశాల, తిరుపతి.

శ్రీ C. S. వీరాసామినాయుడుగారు,

మాజీ మునిసిపల్ కౌన్సిలర్, తిరుపతి.

కీ॥ శే॥ M. G. రాజగోపాలుమొదలియార్ జ్ఞాపకార్థం

కుమారుఁడు శ్రీబాలకృష్ణమొదలియార్, వర్తక ప్రముఖులు, తిరుపతి.

శ్రీ కాంట్ర సుబ్బయ్యసెట్టిగారు,

వర్తక ప్రముఖులు, తిరుపతి.

శ్రీ S. P. నారాయణసామిగారు,

మాజీ వైస్‌చేర్మేన్, తిరుపతి మునిసిపాలిటీ, తిరుపతి.

శ్రీ K. దేవరాజులుగారు,

భూస్వామి, తిరుపతి.

తే॥ వ్యర్థ కార్యాలకెంతయో వ్యయమొనర్చి
అంగలార్చెడి వారెందఱైనఁ గలరు;
పుణ్య పురుషార్థములకన్న ముందు నిల్చి
ఆదు కొనునట్టి దాతలే యరుదు జగతి.

తే॥ ముద్రణాకార్య పూర్తికై ముందు నిల్చి
ధనసహాయముంబు నిడ్డపై త్యాగులెపుడు
నాయురారోగ్య భాగ్యంబు లందునట్లు
శ్రీనివాసాధి దేవ రక్షింపుమయ్య!.

# అంకితము.

ఆ॥ ప్రథిత యశముగన్న భవదీయవంశ దు
గ్ధాంబురాశి విధుఁడవగుచు మిపుల
వినుతి కెక్కినట్టి బెజవాడ గోపాల
రెడ్డివర్య! గుణవరేణ్య వినుమ!

క॥ కృతిభర్తఁగ నిను గాంధీ
శతకము వరియించెఁగాదె? సంతుష్టుఁడవై
కృతి నందుకొను మమాత్యా!
హితులుం బంధువులు లోకులెల్లరు మెచ్చన్

తే॥ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమంత పెద్ద
గ్రంథమున కాధిపత్యంబుగల్గి ధన్య
చరితుఁడవు మున్నె; బాపుజీ శతక మందు
కొనుము, రెట్టింపు ధన్యతన్గనుము సచివ

సీ॥ బాల్యమాదిం బూజ్య బాపుజీ సిద్ధాంత
విశ్వాసి వగుచు జీవించినావు
స్వాతంత్ర్య కలహ శిక్షకు గుండె చెదరక
చెఱసాల వాసంబు జేసినావు
కవితఁబోషించి విఖ్యాతినందిన రెడ్డి
వంశోద్భవుండవై వరలినావు
రాజకీయజ్ఞాన ప్రాజ్ఞుండవై మంత్రి
పదవి ముమ్మారులు వడసినావు.



కృతిభర్త:

గౌ॥ మదరాసు ప్రభుత్వ ఆర్థికమంత్రి వరేణ్యులు

శ్రీయుత బెజవాడ గోపాలరెడ్డిగారు

తే॥ ప్రబల మౌనట్టి గుణపరంపరల తావు
నీవు కావునఁ బూజ్య గాంధీజి నీదు
కృతి పతిత్వంబునకు నుత్సహింపఁగలఁడు
కొనుము కొనుమయ్య! కృతిని గైకొనుము వేడ్క!

మ॥ ఇతివృత్తంబు నలంకరించు పురుషుం
డేడేడు లోకాలఁ బూ
జితుఁడౌ; నట్టి మహాత్మగాథ రచియిం
చే పుణ్యమా! నాది; తత్
కృతికిం భర్తగనోఁచి సంతసము నం
దేభాగ్యమా! నీది మేల్!
బ్రతుకుంబాగు లశాశ్వతంబు లివియే
భవ్యంబులౌ కార్యముల్॥

సీ॥ స్వర్గంబులోన నీజనకుండు పట్టాభి
రామిరెడ్డి వరుండు ప్రేమవినఁగ
సాధ్వీలలామ నీ జననీ సీతాంబ యీ
శుభవార్త చెవిసోకి సుహృదినలర
ఘనుఁడైన చంద్రశేఖరరెడ్డి యగ్రజుం
డమరలోకాన "మేల"నుచు మెచ్చ
అనఘుఁడౌ రామిరెడ్డ్యనుజుఁ డీవృత్తాంత
మాహ్లాద కరమంచు నాత్మనెంచ
రసికుఁడౌ తిక్కవరపు రామిరెడ్డి మా
మయు మందహాస సమ్మతము దెలుప
అర్ధాంగి లక్ష్మి కాంతాంబ యీ సంతోష
కార్యంబునకు లోన గర్వమంద

తే॥ నిసువుకృష్ణ మోహన చిరంజీవి; కల్గు
తది తరంబైన నీదుసంతానమెల్ల
వృద్ధియై నీదుతీవి జీవితము దలఁచి
ప్రమద మలరంగఁగృతి సమర్పణము గొనుమ!

తే॥ అల్లానేరేళ్ల భోగభాగ్యముల తోడ
నాయురారోగ్య సహిత సౌఖ్యములతోడ
మీకుటుంబము వృద్ధిమై మించు నట్లు
గాంధిజీ మిమ్ము రక్షించుగాక! సచివ!



# గాంధీ శతకము.

క॥ జేజే కరుణా మూర్తీ!
జేజే కల్యాణగుణ విశేషితకీర్తీ!
జేజే స్వతంత్ర తార్తీ!
జేజే జేజేలు నీకు జేజే గాంధీ! 1

క॥ శతక మొకటి రచియింపఁగ
మతిగల్గెను నీదుపేర మహిమాన్విత! నీ
యతులితమౌ గాథను, నే
నతిభక్తి వచింతు సంగ్రహముగా గాంధీ! 2

క॥ నీ గాథకన్న నేనిఁక
నే గాథరచింప నుత్సహింతును? లెస్సౌ
నీ గాథ కన్న జగమిఁక
నే గాథం జదువ నుత్సహించును? గాంధీ! 3

క॥ సమ కాలీనుఁడనగు, భా
గ్యమునకె కడునుబ్బు చుండఁగా- నీపైఁ బొ
త్తముగూడ రచించెడి, భా
గ్యముగల్గెను జన్మసఫల మయ్యెను గాంధీ! 4

క॥ కడగండ్లనైన డీకొని
కడుంగడుగ సర్వలోక కల్యాణము, గో
రెడు పూతచరితుఁడవు; నీ
నడవడి యొరవడి గదయ్యా! నరులకు గాంధీ! 5

క॥ కాబా పుట్లీ గాంధీ
తేబాముఁన నెట్టినోములే నోఁచిరహో!
బాబూ! మనుజాతీతులు
కాఁబోలును వారు నిన్ను గనుటను గాంధీ! 6

క॥ పదునెనిమిది వందల నఱు
వదితొమ్మిది క్రీస్తుశక సువర్షంబున, నీ
వుదయించితి గుజరాతున
నది యెంతటి పుణ్యదేశ మగునో గాంధీ! 7

క॥ సువివేక దృష్టి నెగడితి
పవితథముగఁ నీవు బాల్యమందే సరియా!
పువు పుట్టఁగానె తావిని
నవిరళముగ దెసల జిమ్మ యలరదె? గాంధీ! 8

క॥ ఖద్దరు శాలువు దాలిచి
ముద్దుల నొనగూర్చు నీదు ముఖభాగమునం
దద్దిర! కుంకుమ తీరిచి
దిద్దినఁ దొలుకాడు బ్రహ్మ తేజము గాంధీ! 9

క॥ ఆజాను బాహువులు, బహు
తేజంబగు ముఖము. తీరు తియ్యని పలుకుల్,
సాజంబగు పొడవుంగల
పూజితమగు మూర్తినీది మోహన గాంధీ! 10

క॥ లోకము పూర్వంబగు నీ
ప్రాకట మేధావిశేష పరిణతి గని, నిన్
వాకొనెను "మహాత్మా"యని
నీకీ బిరుదమున సాటినీవే గాంధీ! 11

క॥ అవతార పురుషులై యీ
భువిలో జన్మించినట్టి పూర్వు లెవరి కీ
భువిమున్న "మహాత్మా"యను
స విలక్షణ బిరుద మీయఁజాలదు గాంధీ! 12

క॥ "మహాత్మగాంధీ" "గాంధీ
మహాత్మ"యని ముందువెనుక "మహాత్మ" బిరుదం
బహరహముగూడి నిను, నీ
మహనీయతఁజాటె జగతి మహాత్మ గాంధీ! 13

క॥ మతమో, సంస్కరణంబో,
క్షితి పాలనమో మరేదొ క్షితిలో నొకచే
గత ఘనుల పుట్టుకలకది
కతమౌ: నీజన్మ బహుముఖంబగు గాంధీ! 14

క॥ స్వతంత్రయు, మరి యస్పృ
శ్యతా నివారణయు, స్త్రీజనాదరణయు, భా
రత భూమికీ ప్రతిష్ఠయు
హితవగు నీ జన్మ ఫలముతేగద గాంధీ! 15

క॥ తల్లికిడినట్టి బాసలు
చెల్లించితి వక్షరాల! సీమ చదువులోఁ
దెల్ల దొరసానులట, నీ
యుల్లమునకు మెచ్చుకోలు లొసఁగిరి గాంధీ! 16

క॥ తగుఖర్చుమీరి దమ్మిడి
వెగటుగ వెచ్చింపనట్టి విద్యార్థివిగా
నెగడితివా లండనులో
నగునెఱుఁగుదువద "మితవ్యయం"బని గాంధీ! 17

క॥ భోగములకు నెలవై, బై
రాగుల రాగుల నొనర్చు ప్రమదస్థలమై
తూగెడు లండను నగరమె
నీగుణము చలింపఁజేయ నేరదు గాంధీ! 18

క॥ అల దక్షిణాఫ్రికాలోఁ
"దలపాగాఁదీయు" మంచు ధట్టించుచు నిన్
బలుకఁగ న్యాయస్థానము
చలియింపని మేరు ధైర్యశాలివి! గాంధీ! 19

క॥ వీఁపుపయి నిన్ను మోదెను
కాపురుషుఁడు; దక్షిణాఫ్రికా దొరతన "మా
పాపిని జూపింపుఁ" డనన్
జూపక రక్షించి కరుణ జూపితి గాంధీ! 20

క॥ ఉప్పునకు సుంక మిడుటది
తప్పని సత్యాగ్రహంబు దండి నొనర్పన్
గుప్పున నాంగ్ల ప్రభుత్వము
"ముప్పు"ని తొలగించె శిస్తు మోహన గాంధీ! 21

క॥ పరదేశ వస్తువుల్గొని
మురియకుఁడది యెన్నఁటికిని మోసం"బని, య
క్షరముల నిజమగు విషయము
ధర నుడివిన యట్టి దూరదర్శివి గాంధీ! 22

క॥ పరదేశ వస్తువునకై
నరుఁడిచ్చెడి చిన్ని రాగినాణెంబును, నీ
భరతోర్వి కార్మికునకున్
జరిపెడి యపకారమంటి సత్యము గాంధీ! 23

క॥ చులుక నగు పెరటిచెట్టును
పలె దేశీయముల మనమె వర్జించినచో
బలపడునే వాణిజ్యము?
కలిమిందేశంబు తూఁగఁగల్గునె? గాంధీ! 24

క॥ ఎగబెట్టుకొని మొగమ్ములు
దిగుమతులకుఁజూడ యుద్ధతీవ్రతచే, నా
దిగుమతులు పూజ్యమాయెను
వెగటయ్యెను బ్రతు కనేక విధముల గాంధీ! 25

క॥ మనదేశ వస్తువులనే
మన మెప్పుడుఁ గొనుచునున్న మనదేశములో
మన కందమైనవే, తల
మునుకలుగఁ దయారుగావే? మోహన గాంధీ! 26

క॥ జననిని భార్యఁగ, భార్యను
జననిగ భావింపఁజేసి జనుని బశువుగా
నొనరించు మద్యపానము
చనదని వాకొన్న జనకసముఁడవు గాంధీ! 27

క॥ ఇల్లాలి పుస్తెతోడం
గల్లంగడి కప్పగించి కడు దుర్మదుఁడై
తల్లీబిడ్డలఁ బస్తుల
నల్లాడఁగఁజేయ నీతియగునే గాంధీ! 28

క॥ భరతావనిలో నెల్లఁ
హరిజను లత్యంత దూరులై యుండుట, నీ
వరసి కరుణతో వారల
దరిజేర్పఁగఁ గంకణంబు దాల్చితి గాంధీ! 29

క॥ గారవమగు నీ హితమున్
దీరుగ నాలించి సర్వదేవాలయముల్
ద్వారములు తెఱచి హరిజన
వారమునకుఁ జొఱవొసంగె వహ్వా! గాంధీ! 30

క॥ ఆ "నల్లజాతిచట్టము"
మానవులం గూడ చనెడి మనమే హిందూ
మానవులగు హరిజనులను
హీనముగాఁ జూచు టెంత హేయము గాంధీ! 31

క॥ గ్రామంబుల సౌభాగ్యమె
భూమికి సౌభాగ్యమనెడు బుధమతివై, యా
గ్రామ పునర్నిర్మాణ
ప్రాముఖ్యము దెలిసి పాటుపడితివి గాంధీ! 32

క॥ గ్రామంబు లేడు లక్షలు
క్షేమంబుగనున్న భరత సీమ యతులమై
హేమమయ క్షేత్రంబై
భూమికి మేల్బంతిగాదె? మోహన గాంధీ! 33

క॥ తలనొప్పి ముక్కునొప్పియొ
కలిగిన వైద్యుండులేని గతితో, నేఁడీ
యిల గ్రామంబు లనేకము
కలవయ్యా! స్పష్టమగును గనుచో గాంధీ! 34

క॥ పరిశుద్ధికి, విద్యకు, నా
గరికతకును దూరమగుచు గ్రామంబులు, దు
ర్భర జీవితమును గడుపుట
పరికించుచు నెపుడు జాలిపడుదును గాంధీ! 35

క॥ దొరతనమునకున్ శిస్తులు
నిరవుగ లోకులకు గంజియిచ్చెడి రైతుల్
కరుణంగొల్పెడు ఋణముల
బరువునఁ గ్రుంగెదరు జానపదముల గాంధీ! 36

క॥ నేఁటి పరదేశములలో
నూటికి నూఱుగురు చదువునుంగలవారే
నేఁటి మనదేశమో మఱి
నూటికిఁ బదునల్వురకును నోఁచదు గాంధీ! 37

క॥ తీరుగ నేదేశంబున్
ధారుణియందష్ట సంపదలు గలదగుచోఁ
గారణము విద్యయేకద
దూరపు టాలోచనంబుతోఁ గన? గాంధీ! 38

క॥ క్రమవిద్యనేర్పి, యతి శీ
ఘ్రములోనే గొప్పతోఁక రాజ్యములెల్లన్
నిముసమొక యంజవేయుట
గమనింతుముకాదె నేఁటికాలము గాంధీ! 39

క॥ నలువదికోట్ల జనావళి
గలభరతావనికి భాష కలదొకటంచు౯
బలుకంగ నోరులేదిఁక
ఫలమేమి స్వతంత్రమూడి పడినను గాంధీ! 40

క॥ క్షితిలో "స్వతంత్రులగు" మీ
హితమగు జాతీయభాష యెయ్యది?" యనుచున్
గతిమాలి యితరు లడిగినఁ
బ్రతి వచనము లేనిదేమి బ్రతుకగు గాంధీ! 41

క॥ ఇదియంతయు గమనించియె
కద హిందీభాష నేర్వఁగా వలెనని, నీ
వది పనిగా నుడివితి వా
తుదిదాఁకను దూరదృష్టితోడను గాంధీ! 42

క॥ పరు "లౌరా!" యన భూమిని
భరియించెడి మన స్వతంత్ర పాలకులైనన్
సరిదిద్ది యీ కొఱంతలఁ
ద్వరపడి మాపుటయ సముచితంబగు గాంధీ! 43

క॥ స్త్రీలోక మన్నియెడలం
గాలూనఁగఁగల్గి భరత ఖండములో, భూ
పాలనముగూడ నెఱపం
జాలెను నీ ధర్మబోధనముచే గాంధీ! 44

క॥ జడియక సరోజినీ నా
యఁడు, పండిత విజయలక్ష్మి యతి భారంబౌ
పుడమి పరిపాలనము, పై
నిడుకొని "సై" యనఁగ నిర్వహింపరె? గాంధీ! 45

క॥ శారీరకముగ నబలలు
పూరుషులకు సాటిరాక పోవుదు రదియౌ!
వారలు మానసికముగాఁ
బూరుషులకు నెందుఁదీసి పోదురు? గాంధీ! 46

క॥ సంతాన పోషణము స్త్రీ
వంతేకద? "స్త్రీకి విద్యవల"దని పల్కే
వింతైన మానుసుల కా
వంతైనను దెలియదీ రహస్యము గాంధీ! 47

క॥ వరుస బలి మానుచో, మా
తిరుపతి గంగమ్మ కనులు తీక్ష్ణములగు, నీ
తిరుమంత్రముచే నిపుడా
తరుణియు విడనాడె జంతుతతిబలి గాంధీ! 48

క॥ దైవమఁట! పూజయఁట! అది
గావఁట! సంతృప్తిఁ గూర్చు కర్జంబఁట! దు
ర్భావముగాదఁట! తలఁచిన
నేవము సిగ్గును ఘటిల్లు నెదలో గాంధీ! 49

క॥ "ఖద్ద"రనఁబెదవి విఱచెడి
పెద్దగు జిన్నా నియంత పెద్దగ నిపుడా
ఖద్దరె ధరింపుఁడంచున్
సుద్దులు తన ప్రజకుఁ గఱపఁ జొచ్చెను గాంధీ! 50

క॥ పరదేశ తృష్ణచే, భీ
కర సమరంబులను సల్పి కడు దుర్గతికిన్
గుఱియై జర్మను ప్రజలీ
తఱిసీ సిద్ధాంతములను దలఁతురు గాంధీ! 51

క॥ పలుకొకటి పలుకుచో మత
కులభేదము లొక్కరోమ కూపములోనుం
దలఁపవు; ప్రతిబిం బించుచుఁ
గల జగమా పలుకులోనఁ గన్పడు గాంధీ! 52

క॥ ఒకప్రొద్దుకె మాబోంట్లకు
సకల ప్రాణంబు లొక్కస్థానము జేరున్
బ్రకటించి నెలలకొలఁది గ
నకలంకత నుపవసింతు వయ్యా గాంధీ! 53

క॥ కారా గారము లన్నన్
గారాబపు టిండ్లు నీకుఁ గాఁబోలును; నిన్
"రారమ్మని" శ్రీముఖములు
చేరిన రవ్వంత సంకుచింపవు గాంధీ! 54

క॥ పలు సత్యాగ్రహములు మఱి
పలు నుపవాసములు చెఱలు ప్రజకొఱకే, నీ
కలనైన స్వార్థమునకై
తలఁచిన పాపానఁ బోని త్యాగివి గాంధీ! 55

క॥ "క్విట్టిండియా" సభన్వడి
బెట్టఁగ బొంబాయిలోన బ్రిటిషు ప్రభుత్వ
మ్మట్టాడికి నట్టులుడికెను
గట్టకడకు జయము నీవె కంటివి గాంధీ! 56

క॥ సహచారిణియౌ కస్తురి
యిహలోకము బాసి స్వర్గమేగెను, కారా
గృహమందె; నీ చరిత్రలు
బహువిధ కష్టముల కాటపట్టులు గాంధీ! 57

క॥ మతకలహములు భయంకర
గతిరేఁగ న్పాదయాత్ర గావించి ప్రజా
హితబోధ చేసితివి నీ
వతులితమగు శాంతి దూత వగుచును గాంధీ! 58

*క॥ కలకత్తా ప్రజ లతి మత
కలహంబులు ద్రావకముల గావించుచు, నీ
సలహా తలలం దాలిచి
సలిపిరి పన్నీటితోడ జలకము గాంధీ! 59

క॥ ఆటంబాంబులు మానవ
కోటిం బలివెట్టుకొనియె గురుతరమౌ, నీ
మాటలు మతకలహమ్ముల
సూటిగఁ బోకార్చి శాంతి జూపెను గాంధీ! 60

క॥ చదువెన్నఁడు మానితివో
యది మొదలు స్వతంత్ర జీవితార్థివియై, నిన్
గదిసిన యగ్ని పరీక్షలు
హృదయమ్ము ద్రవింపఁజేయు నిపుడుఁ గాంధీ! 61

క॥ గీతయు ఖురాను బైబిలు
నీతుల గ్రహియించి నీవు నిఖిల మతములన్
బ్రీతిగఁ దలంచి లోక
ఖ్యాతిని గడియించితివి మహాత్మా గాంధీ! 62

క॥ శివగుణ గణుఁడగు నీకా
రవి గ్రుంకని రాజ్యమేలు రాచ నగరులున్
నవ నవ సంతోషముతోఁ
బ్రవిమలమగు స్వాగతంబు పల్కెను గాంధీ! 63

*క॥ గుఱిచూచి నన్ను జంపుట
కొఱ కొక్కఁడుజూడ, వాని కొఱుకఁగ ఫణి, యా
గరళమును బీల్చి పామును
నరినిం బ్రేమింతు నంటి వయ్యా గాంధీ! 64

క॥ వహవా! అహింసకెన యీ
మహిలేదది యున్న బ్రిటను మాటలతో, నీ
వహిని స్వరాజ్యం బిచ్చునె?
బహుబల సంపదలుగల్గి భయపడి గాంధీ! 65

క॥ కరములఁ గాంగ్రెసు జెండా
ధరియించిన మున్ను "దప్పిదంబ"ను దొరలే
ధరియించి రిపుడు శిరముల
మురిసెద నీ మార్పుజూచి మోహన గాంధీ! 66

క॥ ఏడఁ బొగబండ్లఁబోయిన
మూఁడవ తరగతులలోనె; ముచ్చటకైనన్
జూడవు పెర తరగతులను
నాడంబర రహిత జీవి వయ్యా! గాంధీ! 67

క॥ పెదవి గదలించుచో, నీ
కెదురాగద సేవకాళి: యెన్నఁడు నీవే
ఉదుకు పను లాది గాగన్
గుదురుగ శ్రమకోర్చి చేసికొందువు గాంధీ! 68

క॥ కొందఱు దేవుని దూతఁగఁ
గొందఱు గురువుగను మఱియుఁ గొందఱు ఋషిగాఁ
గొందఱు దేవుడుగా, ని
న్నందఱు కొనియాడిరో మహాత్మా గాంధీ! 69

క॥ "లోకోభిన్నరుచి" యనెడు
లోకోక్తి విధాన సర్వలోకము నిన్నున్
వాకొనెను వేయి భంగుల
నాకో! దైవాంశుఁడవను నమ్మిక గాంధీ! 70

క॥ ముక్కాలు ప్రాయమందున
ముక్కాళ్లను నడచి జనులు ముగ్ధులు కాగా
వక్కాణింతువు నీతులు
బక్కా నీ కెచటనుండు బలమది గాంధీ! 71

క॥ ధనకనక వస్తువాహన
మును సర్వము దేశ దాస్యము [illegible] కొఱకునై
వినియోగపఱిచి తేమిడి
ధనమును వరియించినట్టి త్యాగివి గాంధీ! 72

*క॥ చెలువొందెడు పెనుగొండన్
బలమగు నీ యుత్సవమునఁ బాల్గొని నీపైఁ
దెలుఁగులకుంగల భక్తిని
దెలిపెను నొక మేఁకగూడ స్థిరముగ గాంధీ! 73

క॥ జననీ స్తన్యము గ్రోలెడు
తనయుఁడు నీ పేరు వినినఁ "దారకమంత్రం"
బని తెలియునేమొ "జే"యని
తనపని విడనాడి పల్కు తథ్యము గాంధీ! 74

క॥ సూదంటు రాయివలెఁ బ్రతి
వాదుల వడిలాగు వశ్య వాక్శుద్ధుఁడవౌ!
కాదన్న నాంగ్లు లొకపరి
నీదరిఁ జేరరు గదయ్య! నిజమిది గాంధీ! 75

క॥ ప్రళయాంతకుఁడగు హిట్లరు
గెలిచిన చర్చిలు ప్రధాని గృహము వదలి నిన్
గలియ భయపడుచు నొకతఱి
పలాయనము చిత్తగించె బళిరా! గాంధీ! 76

క॥ అల్లారు ముద్దుగాఁ బసి
పిల్లలు గుమిగూడి నీదు పేరు నుడివి, నీ
కెల్లం బ్రొద్దుల "జేజే"
లుల్లము లలరంగ నుడువు చుందురు గాంధీ! 77

క॥ హరికథలు పురాణంబులు
పరిపాలక సభలు జన సభాస్థలములు, శ్రీ
హరిభజనలు నీ గాథల
స్మరియింపక జరుగవయ్యె సతతము గాంధీ! 78

క॥ కడు తీపగు నీ నామము
తడవక తమ జీవితమునఁ దప్పిన వారున్
బుడమిపయి వానలోనం
దడియని వారుండఁబోరు తథ్యము గాంధీ! 79

క॥ నిను వినని మనుజుఁడెవఁడో
మనుజుఁడు గాడతఁడు సర్వమహి; మనుజుండై
నిను జిత్రముననుగనఁడో
కన నాతండంధుఁడే జగంబున గాంధీ! 80

క॥ గాంధీ భవనము లాపై
గాంధీ వీధులును బడులు గాంధినగరముల్
గాంధీ యుద్యానము లిటు
గాంధీ మయమయ్యె నీ జగంబే గాంధీ! 81

క॥ స్త్రీలం బురుషుల వృద్ధుల
బాలుర బాలికల వయసు వారలలో, నీ
లీలలు కొనియాడని వా
రీ లోకమునందు నుండరేయెడ గాంధీ! 82

క॥ "నీవే లోకము, లోకము
నీవే"యను రీతి దెసలు నిండారంగా
నీవాణి మారు మ్రోగెను
బావన సందేశమై శివంకర గాంధీ! 83

క॥ ఆర్త త్రాణుఁడవగు, నీ
మూర్తిని జిత్రించి నీ ప్రబోధనలఁగడుం
గీర్తించె; సర్వభాషల
వార్తాపత్రికలు సర్వ వసుమతి గాంధీ! 84

క॥ శతవృద్ధులు సైతము, భూ
పతి పేరే యెఱుఁగ రొక్క బాలునకున్నీ
ప్రతిమం జూపిన, నీ పే
రతి శీఘ్రమె నుడివితీరు నయ్యా! గాంధీ! 85

క॥ నీ సహనము నీ శాంతియు
నీ సత్యము నీ యహింస నీ సమదృష్టుల్
మీసముపయిఁ జెయినిడి, యే
త్రాసము లేకుండఁ జెప్పఁదగినవి గాంధీ! 86

క॥ విద్యార్థి లోకమెప్పుడు
పద్యములం, గద్యములను, పాటలలో, సం
వేద్యములగు నీకథ "లతి
చోద్యము"లని చదువుచుండు శుభగుణ గాంధీ! 87

క॥ పాపి యొకఁడు ఢిల్లీలో
నీపై బాంబొకటి విసర నెనరున వానిన్
గాపాడితి వతి దయతో
భూపాలుర నూఱడించి మోహన గాంధీ! 88

క॥ పల్లెలు పటణములలో
నిల్లిల్లును నీదు బొమ్మలిడుకొని పూజల్
చల్లంగ సల్పుటంగని
యుల్లములో సంతసించు చుందును గాంధీ! 89

క॥ పెద్దలగు వారిచెంతం
బెద్దవుగాఁ జిన్నలకును జిన్నవుగా, నీ
వొద్దికతో వర్తింతువు
ముద్దుల నడవడులు నీవి మోహన గాంధీ! 90

క॥ నీ సహనము నీ శాంతియు
నీ సత్యము నీ యహింస నీ సమదృష్టుల్
మీసముపయిఁ జెయినిడి, యే
త్రాసము లేకుండఁ జెప్పఁదగినవి గాంధీ! 86

క॥ విద్యార్థి లోకమెప్పుడు
పద్యములం, గద్యములను, పాటలలో, సం
వేద్యములగు నీకథ "లతి
చోద్యము"లని చదువుచుండు శుభగుణ గాంధీ! 87

క॥ పాపి యొకఁడు ఢిల్లీలో
నీపై బాంబొకటి విసర నెనరున వానిన్
గాపాడితి వతి దయతో
భూపాలుర నూఱడించి మోహన గాంధీ! 88

క॥ పల్లెలు పటణములలో
నిల్లిల్లును నీదు బొమ్మలిడుకొని పూజల్
చల్లంగ సల్పుటంగని
యుల్లములో సంతసించు చుందును గాంధీ! 89

క॥ పెద్దలగు వారిచెంతం
బెద్దవుగాఁ బిన్నలకును బిన్నవుగా, నీ
వొద్దికతో వర్తింతువు
ముద్దుల నడవడులు నీవి మోహన గాంధీ! 90



క॥ పుట్టితివి పోరుబందరు
పట్టణమున భరతమాత వరపుత్రుఁడవై
గిట్టితివి కడకు ఢిల్లీ
పట్టణమునఁ బ్రార్థనపు సభాస్థలి గాంధీ! 91

క॥ పదివేల జనములో, నీ
పదములపైఁ బడిన రీతిఁబడి నిను "గాడ్సే"
యెదఁ బెట్టుకొనెను బిటికికి
నిదర్శనుండగుచు ధారణీ స్థలి గాంధీ! 92

క॥ గుండెకు సరిగఁ దుపాకీ
గుండుల గుటిచూచి నిన్ను గూల్చి యతఁడు, భూ
మండలి హృదయము బగబగ
మండించె స్మరింపఁ గడుపు మండును గాంధీ 93

క॥ తనచేతి కత్తితోనే
తనమెడ గోసికొనురీతిఁ దండ్రీ! హిందూ
జనితుఁడగు నిన్ను, హిందూ
జనుఁడే పోకార్చె నుడువఁజాలను గాంధీ! 94

క॥ గుండుపయి గుండు నాలుగు
గుండులు వడిదూర నీదు గుండెలలోఁ, గో
దండుని దలఁచితి వపుడున్
గుండెలు నీరౌను దలఁచుకొనుచో గాంధీ! 95

క॥ తలబట్టగట్ట స్వేచ్ఛా
కలహమ్మును ముప్పదేండ్లు గావించితి వా
ఫలమేమొ దక్కె ముప్పది
నెలలుం జీవించిచూడ నేరవు గాంధీ! 96

క॥ గాంధీ గాంధీ గాంధీ
గాంధీ"యని లోక మేక కంఠముతో, "భూ
బాంధవుఁడిఁక లేఁడా!"యని
బంధురమగు వెతల పాలఁ బడియెను గాంధీ! 97

క॥ పలు పలుకులేల! నీవీ
యిల వదలఁగ సూర్యుఁడప్పుడే మఱుగయ్యెన్
విలసిల్లె నంధకారము
"వెలుఁగు మలిపికొంటి" రన్న విధమున గాంధీ! 98

క॥ కొండంత రాజ్యభారము
పండిత నెహ్రూ పటేలు ప్రభృతుల సుభుజా
దండముల నిల్పి వారల
గుండెల నెఱజీల్చి దాఁటుకొంటివి గాంధీ! 99

క॥ సకలోర్వియు నీకతమున
నొక దిక్కుంగలది గాగనుండఁగహా! నీ
వొకదిక్కులేని రీతిఁ
సకల సహాయములు గల్గి చనితివి గాంధీ! 100

క॥ పదియుం దొమ్మిదిపై, నలు
వది యెనిమిది క్రీస్తు శకపు వర్షమునందున్
గదిసిన జనవరినెల, ము
ప్పదిలో హంతకుని పాలఁబడితివి గాంధీ! 106

క॥ విను వేయివర్షములపైఁ
బొనరఁ బునర్జన్మ మెత్తి పూర్వజ్ఞానం
బును గల్గి నీయశస్సులఁ
గనుభాగ్యము కొఱకుఁ గలలు కందునుగాంధీ! 107

క॥ కత్తి కటారి ధరింపక
ముత్తా! అచ్చెరువు; పర ప్రభుత్వంబును, నీ
వెత్తించి పోతి విఁక నా
వృత్తాంత మొకింత చెవినివేసెద గాంధీ! 108

క॥ జనకుఁడు "గంగార్యుఁడు" నా
జననియొ "లక్ష్మమ్మ" కాగ జన్మించితి, స
జ్జనములు "సుబ్రహ్మణ్యా!"
అనఁగా "బయిరెడ్డి" వంశమందున గాంధీ! 109

క॥ నీ సోపదేశములు కడు
వాసింజెందుటకు స్వర్గ వైభవములు, నీ
వాసించు రీతి నబ్బుట
కాసీతాపతి స్మరింతు నాత్మను గాంధీ! 110

సంపూర్ణము.

*క॥ మొనమొన్న నాఫ్రికాలో
ఘనమగు నొక తోఁకచుక్క గాన్పించుట, "దు
ర్దినములిఁక గాంధిచను"నని
మునుమున్నుగఁ దెల్పుచేమొ! మోహన గాంధీ! 101

క॥ కొందఱు ఖిన్నత నందిరి
కొందఱు "హా" యనుచు నశ్రుకూలిరి; మఱియుం
గొందఱు నసువులఁ బాసిరి
అందఱు నీ మరణదుఃఖ మందిరి గాంధీ! 102

క॥ జిన్నా చర్చిలు స్మట్సును
విన్నాల్లరు రాజకీయ నీతులలో, వా
రున్నీ నిర్యాణమువిని
ఖిన్నతఁ బేర్కొని నీదు కీర్తిని గాంధీ! 103

క॥ ఎక్కడ పరాసు దేశ మ
దెక్కడ నీజన్మభూమి యీ నాఁడదిగో!
ముక్కోటి దేవతలకున్
మ్రొక్కెదరట నీదు సౌఖ్యమునకై గాంధీ! 104

క॥ "ఏపని చేసెడువానికి
నా పనిలో మృత్యు"వనుచు నందురు పెద్దల్
నీపని మానవ సేవయ
యాపనిలో నీకు మృత్యువబ్బెను గాంధీ! 105